





# మహిళలు

## విలువ,ధర్మాలు

**మాతృశ్రీ**





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120034962

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి"

# మాతృశ్రీ

"రసప్రియ"

పోతేదార్ కేశవాచార్య, బి.ఎ.

శ్రీరంగాపురం.

# కృతిసమర్పణ

గీ॥ జనని నీస్మృతి కోసమే పనియొనర్ప
సతముగాదది కావ్యమో శాశ్వతముగ
వెలయగలదని యెంచి నీపేర దీని
గూర్చినాడను గానగైకొనగదమ్మ!

గీ॥ నన్ను నవమాసములు మోసి కన్నతల్లి!
నన్ను ప్రేమసాకిన కరుణాపయోధి!
నీ పవిత్ర పాదాల కన్నీళ్లఁగడిగి
కృతి సమర్పింతు నీకు సంప్రీతిగొనవె!

ఉ॥ ఒక్కొక పద్దియంబున కెదో
బెడదైయెడదన్ గలంచి నా
దృక్కుల నీరు గ్రమ్మ రచియించితి
నీ స్మరణార్థ మీ కృతిన్
మక్కువ స్వీకరింపగదె నన్
గడుపారగ కన్నతల్లి! నల్
దిక్కుల కెక్కు నీ పృథుల
దివ్య పవిత్ర చరిత్ర చందికల్!

# మాతృదేవోభవ

శ్లో॥ "భూప్రదక్షిణ షట్కేన
కాశీయాత్రా యుతేనచ
సేతుస్నాన శతైర్యశ్చ
తత్ఫలం మాతృ వందనే"

అన్నదమ్ము లెందరైన
కన్నతల్లి ఒక్కటేరా!
మతం కులం వేరైనా
మాతృదేశ మొకటేరా!

తల్లిని మించిన దైవం
ధరణిలోన లేదురా!
జన్మభూమి కన్న మిన్న
స్వర్గమేది లేదురా!

ప్రసవ బాధ కలిగించిన
పసిబిడ్డను ముద్దాడుచు
స్తన్యమిచ్చి తన సర్వ
స్వము ధారపోయుచు పెంచును.

అమ్మ ఎంత కరుణామయి!
అమ్మ ఎంత పరదైవము!
అమ్మ ఋణము జన్మలోన
అణువంతయు దీర్చలేము.

— రసప్రియ

మాతృశ్రీ

# అభినందనాశీర్వాదములు

"ఆంధ్ర జెర్నాడ్‌షా"
జగజ్జనని వేదంతకవిగారు

దేశము నీ నుడుల్ వినెడి ధీనిధివై విలసిల్లి విశ్వసం
దేశము దిక్కులెక్కి వినుతించెడి కైవడి ఇమ్ము శ్రీవితో
కేశవ! తల్లి చల్వలకు కేలు ముగిడ్చి చిగుర్చుకైత వా
గీశుల కెక్కికీర్తి గడియించుము నీకు చిరాయువుల్ సిరుల్!

నామము లెన్నియోగలవు నాటికి నేటికి వాటిలోన నీ
నామము శ్రేష్ఠమై మొదటి నామముగా విలసిల్లె కేశవా!
నీమధురప్రసన్న కమనీయ కళాకవనమ్ము గూడ భా
షామణి చల్వతో నెగడి శాశ్వతమై పొగడించు ధాత్రిపై!

మునుముందీవు కవిత్వ మల్లుటకు బాబూనీవు కైమోడ్చి నీ
జననీరత్నమునే గ్రహించితివి, పూజల్‌సల్పి నీతల్లి చ
ల్లని చల్వల్ కురిపించు కొంటివి, కళాలావణ్యయై నీ కవి
త్వనటీరత్నము దిక్కులెక్కిసిరిపూతల్ పూచుత≡ కేశవా!

## "ఆంధ్ర మిత్రన్"

శతావధాని డి.కె. బాలబ్రహ్మాచార్యులుగారు

సీ మాతృశ్రీ గ్రంథము
ప్రేమజ్ఞ వినిపించ వింటి విషయంబునకే
నామోద మొందితిన్ గడు
క్షేమంబగు నీకు కృతికి కేశవ సతమున్!

మాతృాద్వైత విముక్తి చిత్తమున సంభావించి యేరీతిగా
మాతృశ్రీని రచించినావు కృత ధర్మా! కేశవాచార్య! స
న్మిత్రుల్ మెచ్చి నుతింప నీకృతిశుభోన్మేషాప్తి మై మాతృభ
క్త్యుత్కృష్టి ప్రదిపాదియైవెలయు సుమ్మాచంద్రతారార్కమున్!

అర్థి జనంబు గోరిన సహాయము శక్తి కొలంది సల్పు ని
స్వార్థపరుండుసాధుహితబంధురతుండయియెన్న డేనియున్
వ్యర్థులజోలికిన్ జనక పండిత మైత్రి వెసంగి కేశవం
దర్థగణాంకశాఖ నవహా! అధికారము నంది వర్ధిలెన్.

"వ్రసన్న భారత వ్యాస"
వాజపేయయాజుల రామసుబ్బారాయుడు గారు

నీవు రసప్రియుండవవనిన్ రసవంతములై ప్రసన్నమై
చేవ గలట్టి సత్కృతులచే విలసిల్లుచు నుంటివీవు, శి
ష్యావళిలోన వశీర్జుడ వంచుదలంచుచు నుందునిన్ను,
తావిభుడిచ్చుగాత బ్రహుదంబుగ నీకు జిరాయురున్నతుల్.

—

త్ర్యర్థికావ్య నిర్మాత మహాకవి శేఖర, కవిసింహ
పోకూరి కాశీపత్యవధానులుగారు

చారు పదాంచితంబువయి శ్రావ్యమునై రసవత్తరంబునై
సూరి మనోహరంబువయి శుంభదలంకరణాన్వితంబునై
భూరి సలక్షణంబునయి పొల్చెడు కైత గలట్టి కేశవా
చారికిచెల్లునంచును "రసప్రియ"యన్ బిరుదంబునిచ్చితిన్

గురునియందు భక్తి కోవిద కవులందు
ప్రీతి యనుజ మాతృ పితరులందు
దయగలాడు పోతెదారు శ్రీ కేశవా
చారి సుగుణరాశి యౌర తలప!

వీడడు శమమున్ దమము
వేడడుమాధవుని దక్క వేరొక వేల్పు
కూడడు దురితాత్ములనెపు
డాడడు కల్లలను కేశవాచారి సుడీ!

'కవి సార్వభౌమ'

వడ్డాది సీతారామాంజనేయకవిగారు

పుస్తకము పేరు "మాతృశ్రీ". ఆపేరులోనే ద్యోతక మగుచున్నది విశ్వపునీతమగు పవిత్రత. ఆ పవిత్రభావ పరిశుద్ధి సాధన చేసి, సాధించినది గాక సమస్త ప్రాణి హృదయాంతరాళముల యందును ప్రతిధ్వనించు ప్రేమా ను యుక్త మధుర మధురాతి శబ్ద బ్రహ్మము. జననము నొందిన క్షణము నుండియూ పసితనమున, కన్నతల్లి కరుణామృత పయః పూర్వములతోనూ, బాల్యమునుండి యూ తల్లి నిర్మల హృదయ ప్రేమామృత రసపరిప్లుతా హార సేవనముతోనూ తరువాత తల్లి హృదయ ద్రవీ భూతామరాగ సిక్తవాత్సల్యామృత సేచనములతోనూ మాన వత్వము సిద్ధింప నిర్మలానంద డోలికల విహరించు మాన వుని హృదయ దర్పణమున మాతృమూర్తి దయామయ మూర్తి భాసిల్లుచుండుట సహృదయులకు విదితము. తీర్థపాదులగు శంకరులు గూడ మాతృదేవతా స్తుతిలో " క్షుధార్తా జననీం స్మరంతి " యని వాక్రుచ్చినారు గానతన తనయుని లాలించుట, పోషించుట తల్లికే తెలియ వలెను. పిల్లయాకలి తల్లికిదక్క ఇతరుల కెట్లు తెలియును కనుకనే ప్రతి జీవియు బాధ కలిగినపుడు అమ్మా! యని తలచి వాపోవు చున్నది.

శిశువు గర్భస్థుడైనది మొదలు కలుగబోవు బిడ్డపై మమకారముచే నవమాసములు మోసి, దుర్భర ప్రసవ వేదనల భరించి, పుట్టినబిడ్డ మొగంబు చూడగనే తనబాధ

మరచి, ఆనందమున మబ్బుచు, అనురాగ పారవశ్యమున నేమ మరచుచూ, తన మధుర పయోధారల బిడ్డని పెంపొంద జేయుచు తన సర్వస్వము బిడ్డనికై ధారపోయు మాతృదేవత జీవికి ప్రత్యక్ష దైవతముగాదా! బిడ్డని సేమమునకై తహ తహలాడుచు వేయిదేవుళ్ళకు బిడ్డను చిరంజీవిగా జేయుమని గడియగడియకూ మ్రొక్కులిడుచు తన సుఖమును వదిలి బిడ్డయే తన పెన్నిధియన మురిసి మురిపించు తల్లికన్న యిహలోకమున పరదేవత యెవరు? "నమాతుః పరదైవతమ్మ్" ని పెద్దలు చాటియుండిరి గదా! అందుచే జీవికి మాతృదేవతయందు ప్రేమ భక్తి గౌరవము గలిగి యుండుట కృతజ్ఞతా సూచకము. మానవ సహజ స్వభావము. తద్వ్యతిరేకత మానవ జన్మమునకు వ్యతిరేకమగు పుట్టువుగా నెంచబడును.

తల్లి తన సంతానమును జూచుకొనుచూ అనిర్వచనీయానందమెట్లు పొందుచుండునో యట్లే సంతానము గూడ మాతృమూర్తిని సేవించుచూ స్వర్గసుఖంబుల కన్న మిన్నయగు సౌఖ్యసంపదల ననుభవించు చున్నట్లు భావ సంతుష్టిని పుష్టినందు చుండును. "జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపి గరీయసి''యని రానురాను మానవుల మనః ప్రవృత్తి వెర్రితలలు వేయుచుండుటవే అడ్డాలనాడే బిడ్డలుగాని గడ్డాలనాడు కాదని మాతృదేవత శోకించు పిదప కాలము దాపురించినది. భార్య కాపురమునకు వచ్చినదాది తనను

అష్టకష్టములుపడి పెంచి పెద్దచేసి, తనజీవితసర్వస్వమును ధారపోసి, దేహదార్ఢ్యము తిరిగి బెండువారి జరాభార కృశీ భూతమగు తల్లిపై యేవగింపు నిర్లక్ష్యము, విసుగు కలిగి యామె తనపై పెట్టుకున్న యాస వడియాస గావించుచు తనప్రవృత్తియే యామెకు హృదయశల్యమై వేధించు నటుల ప్రవర్తించు కుపుత్రులు బహుళముగా పెరుగుట భారతదేశ దౌర్భాగ్యము, మాతృదేవతల పురాకృత జన్మ పాప ఫలము.

అట్లని అందరూ నట్టికృతఘ్నులు మాతృద్రోహులు కారనుటకు యీ కృతి కర్తవంటి నిరంతర మాతృదేవతా పూజా సక్తులు కొందరు క్వాచిత్కముగా నుండుట నాయీ మాతృదేవతల యదృష్టము.

"మాతృశ్రీ" యను నీ సత్కృతియట్టి ప్రత్యేక విశిష్టతతో గూడికొన్నది. కృతి ప్రారంభము నుండియూ కృతికర్తకు మాతృదేవత పైగల భక్తి ప్రపత్తులు మూర్తీభవించుచూ త్రైలధారా వచ్ఛిన్నముగా ప్రవహించినది. కవితా వేశమునకు మూలకారణము తన్నుగన్న తల్లి వైద్య శిఖామణుల కందరాక ప్రాణసంకటముగా పరిణమించిన వ్యాధితో బాధపడుచుండగా జూచి సహింపలేని కుమారుని హృదయమున జనించిన యాందోళనమే ప్రాతిపదిక. అట్టి ఆవేదనమే పద్యరూపమున రూపుగొని కవికి మాతృ దేవత యందుగల ప్రేమ, అనురాగమును చదువరుల

మాతృశ్రీ

డెందములఁ నిండుకొనుచు వారి మనఃపీఠముల సైతము మాతృ భక్తి మాతృ వియోగ జనిత దుఃఖమును స్పందింప జేయు సమర్ధతతో వెలుగొందిన కవి యుపాసించు మాతృమూర్తి కమరత్వమును కవి కవితా కృషికి సార్థక్యతను చేకూర్చినది. ఇది తొలుతటి కృషి గావచ్చును. ముమ్ముందు మాతృశ్రీ ఆశీర్విశేషంబున ఉత్తమ కృతి పత్రికల ప్రవర్ధిల్ల జేయగలరని యీ కవి వరునకు మా కామేశ్వరి యాశీస్సు.

—

శ్రీరస్తు

ఓం నమః కామేశ్వర్యై

# ప్రశంస

శ్రీ తరుణీ శ్రీవాణీ
మాతృశ్రీ కరుణ నొందదమానిత దీక్షన్
జేతమ్మునఁ బూజించుచు
ఖ్యాతిన్ మనుమయ్య కేశవాచార్య కవీ!

కవితా మాతృ శ్రీ పద
నవనళినా నవముఁ గొలిచిన సనాతన స
త్కవి భృంగగీతి నీ మది
కవిరళమురద మిడుత! కేశవాచార్య కవీ!

సుమన స్ప్రభాగ్ర తాంబూ
లము కవికే, నీకుఁ దత్కళన్ మాతృశ్రీ
ప్రమదమున నొసఁగి గౌరవ
మమరించిన దోహా! కేశవాచార్య కవీ!

రవి కానని చోటైనన్
గవి కాంచుఁగదా? జగత్ప్రకార వివేకం
బవురా! మాతృశ్రీ కృప
నవనిన్ నింపితివి కేశవాచార్య కవీ!

మా రా.సు.రాణ్మహా కవి
నారాధవమున్ బొనర్చు నఘుని నిమ్మన్
భారతి భారత గౌరవ
హారిగ నలరించుఁ గేశవాచార్య కవీ!

రసవత్కావ్య సుమంబుల
విసరముతోఁ గవితనీవు వెసఁబూజింపన్
బస నొసఁగి రా.సు.రాట్కవి
యుపదృశధృతి మనుచుఁ గేశవాచార్యకవీ!

మాతృశ్రీ

పిన్నతనంబున నెంతో
విన్నాణపుఁ దెలుగుఁగైత వినిపించిన నీ
ఉన్నతి మాతృశ్రీ యో
యన్నా యిడకున్నె? కేశవాచార్యకవీ!

బియ్యేపై మాతృశ్రీ
వయ్యారే! కొలిచి పావనాత్ముడ వగునీ
నెయ్యము వాంఛింపరె కవు
లయ్యా! మేలయ్య! కేశవాచార్యకవీ!

అనయము సీతారామాం
జనేయ కవి సార్వభౌమ సరళాశీస్సుల్
మనుచుత విన్నానందం
బనూనగతి నొసఁగి కేశవాచార్యకవీ!

కవిసార్వభౌమ, స్వరాజ్యకవి
వడ్డాది సీతారామాంజనేయకవి

లజపతిరాయ్ పేట
పాలకొల్లు
5-2-1964

# నివేదన

—రచయిత

అది 1958వ సంవత్సరం ఇప్పటికి నాల్గుదశాబ్దాలు గడిచిపోయినవి. అప్పుడు నేను మాతృశోకంలో వ్రాసికొన్న పద్యాలివి. వ్యథను వెలికి తీయుటం మనసొప్పక ఇంతకాలం అచ్చు ప్రయత్నం చేయులేదు. వ్యథలో కవి వ్రాయక మానడుకదా! "అగ్నేరాపః" అగ్నినుండి నీరు పుడుతుంది. తపననుండి కన్నీరు పుడుతుంది. మాతృశోకంలో పరితపిస్తూ వ్రాసికొన్న ఈపద్యాలు నా కన్నీటి కెరటాలు. అవి ఒక సహస్రందాక ప్రవహించి నేటికీ నా యెడద కడలిని కల్లోలపరుస్తున్నవి. వాటినుండి సుమారు వందమాత్రం ఎంపికచేసి మాతృశ్రీ, స్మృత్యంజలి, బాష్పాంజలి, నిరసనాంజలి, హృదయాంజలి అనుఖండి కలను కృతిగా సంతరింప జేసినదే ఈ "మాతృశ్రీ".

మాతృమూర్తి ఎవరికి ఆరాధ్య దైవంకాదు? ఆమె ప్రేమ అవ్యాజమైనది. ఆమె కరుణ అపారమైనది. ఆమె క్షమా శమ దమాదులు అనన్యాదృశములైనవి. ఆమె త్యాగనిరతి అనంతవిశ్వానికి చేతనావిభూతి యైనది. ఆమె మమతానురాగాలు నిరంతరం ప్రవహించే జీవనదుల వంటివి. ఆమెలేక ప్రకృతి వికృతిగా మారుతుంది; సమస్త ప్రాణికోటికి కాళరాత్రి అవుతుంది. ఆమెయొడిలో ప్రకృతి

వికసిస్తుంది. సమస్త ప్రాణికోటి నెగడుతుంది. ఇది సార్వజనీన సార్వకాలీన సత్యము. అందువలన ఇందలి కొన్ని పద్యాలు స్వగతాన్ని స్ఫురింపజేసినా మాతృశక్తి రసానుభూతి సహృదయులోకాని కంతటికీ ఆస్వాదయోగ్య మగునని భావింతును. " జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి '' అన్నారుకదా పెద్దలు.

నేనప్పుడు హైదరాబాదులో ఉద్యోగంచేస్తూ కుటుంబముతో ఉన్నాను 1957 అక్టోబరులో మా అమ్మగారు అస్వస్థులై చికిత్సకోసం హైదరాబాదులో ఉన్న నాదగ్గరకు వచ్చిరి. ఏడాదికిపైగా చికిత్ససాగినది. ఆరోగ్య రక్షకై చేసిన దైవప్రార్థనలు, బాబాల దీవెనలు వైద్యప్రయత్నాలు ఫలించ లేదు. తేది 14-12-1958 విళంబి మార్గశిర శు॥ ౪లు ఆదివారం మా మాతృమూర్తి మమ్ము వీడి దివంగతులైరి. మృత్యువు ఆపరానిదికదా!

విఫల మనోరథుడనై నిర్వేదంలో కుములుతూవున్న నాలో అంకురిస్తున్న నాస్తికతను పైదొలగజేసి నాసంతప్త హృదయాన్ని శాంతపరచి నన్నుద్ధరించుటకో అన్నట్లుఅనుకోకుండ ప్రమోషనుపై సెప్టెంబరు 1959లో హైదరాబాదు నుండి కరీంనగరుకు బదిలీయి వచ్చి అచ్చటి వేములవాడ పుణ్యక్షేత్రంలో వెలసిన శ్రీ రాజ రాజేశ్వర స్వామివారిని

సందర్శించు కొంటిని. దర్శన మాత్రాన నామనసూఱట పడ్డది. దర్శించు కొన్నప్పుడెల్ల ఒకటి రెండు పద్యములు శ్రీరాజరాజేశ్వరరా! అనుమకుటంతో వ్రాసికొన్నాను. అట్లు 12 పద్యములు వ్రాయువరకు నా సంతాప ముపశమించి నది అదే మకుటంతో సాగిన ఆపద్యాలు శతకరూపం దాల్చి రెండు సార్లు అచ్చు అయినది. (మొదటిసారి వేములవాడ దేవస్థానములవారి ఆర్థికసహాయంతో రెండువసారి తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహాయంతో) నిర్వేదం లో నిరాశా ధూమంలో తల్లడిల్లుతున్న నాలో ఆశావాదం ఆస్తికత చిగురించినవి. ఇది ఆస్వామి దయావిశేషమే అని నమ్ముతున్నాను.

పూజ్యపాదులు నాగురు దంపతులు (కీ. శే. రా. సు. రాట్నవి దంపతులు) నా మాతృశ్రీ పద్యాలన్నీ అవశ్యం అచ్చు కావలెనని కాంక్షించిరి, ఆదేశించిరి. తమంత తామే కవిసార్వభౌమ బిరుదాంచితులగు శ్రీ వడ్డాది సీతారామాంజ నేయ కవిగారిచే అభిప్రాయమును వ్రాయించి తెప్పించి ఇచ్చిరి (1964). ఆ మహనీయ మహాకవి జీవించి యుండ గావారిని దర్శించుకొను భాగ్యం నాకు కలుగలేదు వారి అమూల్యమైన అభిప్రాయంతో, మరియు నా మాతృశ్రీ పద్యాలు నేను వినిపించగా విని ఆనందించి, పరమ పూజ్యులు కీ.శే. అయిన మహాకవి వేదాంత కవిగారు

శతావధాని బాలబ్రహ్మచార్యులు గారు, కవిసింహ పోకూరి కాశీ పత్యవధానులుగారు, వాజపేయయాజుల రామసుబ్బా రాయుడుగారు అనుగ్రహించిన అభినందనాశీర్వాద పద్యా క్షతలతో ఈ మాతృశ్రీ ( అప్పుడు వాసిన పద్యాలు యథా తథంగా ) వెలువరించడమైనది. ఆ మహనీయ పుణ్య మూర్తులకు నా హృదయపూర్వక శక్త్యంజలులు.

ఆనాడు నాకు ప్రాప్తించిన మాతృసేవా భాగ్యం అధిక భాగం తానే గ్రహించి నిండు మనిషియైకూడ నిండు మనసుతో తన అత్తగారికి శుశ్రూషలు చేసి నా మాతౄణ భారము తీర్చుటలో నాకు తోడ్పడిన నా ధర్మపత్ని సౌ॥ కనకమ్మను అభినందించకుండ ఉండలేను.

ఆగష్టు 1999లో కవిసమయంపై రేడియో ప్రోగ్రామ్ వచ్చింది. ముందుగా స్క్రిప్టు ఇవ్వటానికివెళ్ళాను, స్క్రిప్టు చూడకుండానే ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్‌గారు కవిగారూ ఇది ఎలక్షన్స్ జరుగుతున్న సమయం మీరేదో కర్గిల్ పైన నో సామాజికమో వ్రాసికొని తెచ్చి ఉంటారు. అదిప్పుడు వద్దుఅన్నారు మరేదికావాలి? అన్నాను ‘మాతృమూర్తిపై ననో ప్రకృతి పైననో వ్రాసికొనిరండి’ అప్పుడు నేనింటికి వెళ్లి మాతృమూర్తిపై ఎన్నో పద్యాలు వ్రాశానుకదా! అని ఆనాటి మాతృశ్రీ పద్యాలలో కొన్నిటిని మరికొన్నిటినిపైరు

దొరసాని పై వ్రాసి కొనివచ్చి రేడియో ప్రోగ్రాం పూర్తి చేసి కొంటిని. ఈసందర్భంనాకు "మాతృశ్రీ"ని ముద్రించ వలె నని సంకల్పం కలిగించింది.

స్మృతులుంచు కొనరాదని అంటారు కొందరు. ఎందుకని, తెలియదు. అట్లైతే తర్పణాలు పితృదేవతలకు విడవటం యుగాలనుండి వస్తున్న సంప్రదాయాన్ని కాదనగలమా! స్మృతులుంచు కొనడంలో తప్పేముంది? లేదు అని నా అభిప్రాయం.

నలుబది రెండేండ్ల క్రిందట వ్రాసికొన్న సుమారు వెయ్యి పద్యాల నుండి ఎన్నో పద్యాలు, దైవ ప్రార్థనలు, విషాదభరితాలు, స్వానుభూతులు, స్వగతాలు కువైద్య నిందలు విడువబడ్డవి. ఈ నాటికి కొన్ని పద్యాలైన అచ్చు రూపంలో మాతృస్మృతిగా వెలువరిస్తున్నందుకు తృప్తిగా ఉంది. కృతి ప్రసక్తి పద్యరూపంలో విన్నవించు కొన్నాను

నూతన సహస్రాబ్దికి స్వాగతం పలుకుతూ సర్వ జనాళికి శుభం కలుగాలని కోరుకుంటున్నాను.

సర్వేపి సుఖి నస్సంతు - అంతా సుఖించాలి.
సర్వేసంతు నిరామయాః - అంతావ్యాధిరహితులుకావాలి.
సర్వేభద్రాణి పశ్యంతు - అందరూ శుభాలు దర్శించాలి.
మాకశ్చిద్దుఃఖభాగ్భవేత్- ఏఒక్కడు దుఃఖభాజనుడు కారాదు

— కేశవాచార్య

# కృతిప్రసక్తి

కం॥ ఇది మాతృశ్రీ దీనిని
చదువుచు నున్నపుడు కనుల జలమూరుచు నా
యెదనొచ్చునైన దీనిని
జదువుచు నేయుందు మాతృసంస్మృతి యగుటన్.

ఆ॥ మాతృ భక్తి యున్న మనుజుఁ డెవ్వండేని
దీనిఁ జదివె నేని వాని మనసు
వెన్న వోలె కరగి కన్నీరుగా మారి
జాలు వారకున్నె సౌమ్యుడైన?

గీ॥ వేదనా రోద నా వేదనాదులెవడు
పొందునో వాడెపోకవి, పొరలివచ్చు
వాని ప్రతి బాష్పకణమొక పద్యమగుచు
విశ్వవీణను మీటి వినిపించు చుండు.

గీ॥ ఏడ్వవలెనని యుండునే ఎవనికైన
ఏడ్పువచ్చిన యెవడుండు నేడ్వకుండ
కవనమా! ఏల వన్నిట్లు కలచి కలచి
ఏడ్పు పద్యాలు వ్రాయించి తేలయిట్లు?

గీ॥ అగ్నిలో నుండి ప్రభవించు అంబువట్లు
బాధలో నుండియే పుట్టు బాష్పకణము
గాయమే గేయరూపాన కరుణగాను
జాలువారుచు నుండు పద్యాలలోన.

గీ॥ అందుకే అప్పకవి యిట్టులనుచు నుడివె
ఎవడు కరుణామతియొ వాడె కవి యనబడు
శోకమున నుద్భవించెడు శ్లోకములను
పాడుకొన జేయుచును కవి నేడిపించు.

గీ॥ తపనలో నుండి మానవత్వము ద్రవించి
కరుణ రూపాన కన్నీటి కడలి యగును
శోకజలధిని ప్రభవించు శ్లోకలక్ష్మి
క్లేశముల బాపి జనుల రక్షించుగాక!

—

"తస్యశోకః శ్లోకత్వమాగతః"
'కవితఅనిన వేడి కన్నీరు మాత్రమే'

"Poetry is the sister of Sorrow
Every man that suffers and weeps is a poet
Every tear is a verse And every heart a poem."
— ANDRE

"Poets teach in verse what they learn from suffering" — SHELLY

" It is not true that I made Poems
In fact my poems have made me.' — GETE

శ్రీ మత్పర దేవతాయైనమః

# మాతృశ్రీ

ఆ॥ మాతృభాషలోని మాధుర్యమును గ్రోలి
మాతృదేశ కీర్తి మహిని జాట
మాతృసేవ జేయ "మాతృదేవోభవః"
యనెడి సూక్తి పుట్టె నవనిలోన.

గీ॥ ఖగమృగాదులు సైతమీ జగతి తమదు
పిల్లలను నిత్యమెంతయో ప్రేమసాకు
తల్లి ప్రేమ గణింప దుస్తరము గాన
తల్లియే కద ప్రత్యక్ష దైవ మరయు.

ఆ॥ కడుపునిండ పాలు కుడిపి బుగ్గల మీద
ముద్దులు కురిపించి బుజ్జగించి
నిగ్గుకేలి డోలి నిదుర బుచ్చుచు చాల
మురిసిపోవు తల్లి మోదమలర.

ఆ॥ ఇదిగో! పిట్ట బుక్క ఇదిగో! కాకమ బుక్క
బుజ్జి తినుమటంచు బుజ్జగించి
పసిడి వంటి చేత పాలబువ్వను బెట్టు
అమ్మ మమతకెంత కమ్మదనము!

సీ॥ ఊయ్యాల లందున నయ్యాటలాడెడు
ముద్దు పట్టిని గాంచి మురిసిపోయి
ఉగ్గుపెట్టగ నెంతయో గోలగా నేడ్చు
బాలవతంసమున్ జోలబుచ్చి
ఇల్లంత దొర్లుచు నల్లరి చేసెడి
బుజ్జి యబ్బాయిని బుజ్జగించి
చిగురాకు పెదవుల చిరునవ్వు చిలకించు
చిట్టి పాపని మోము చెలువ మరసి
గీ॥ నిగ్గులేత గులాబీల బుగ్గల పయి
మురుపు ముద్దుల వర్షంబు కురియజేసి
పొంగి పోయెడి తల్లి యపూర్వకరుణ
సాటిలేనిది పదునాల్గు జగములందు.

గీ॥ ప్రసవ బాధల భరియించి బడసి బిడ్డ
లను పిదప వారి మూత్ర మలాల మునిగి
ప్రేమ లాలించి పోషించి పెద్దజేయు
తల్లి ప్రేమకు సరియేది ధరణియందు.

గీ॥ సహజ కవితాసుధారస శైలివోలె
కలువరాయని వెన్నెల చలువవోలె
మధురమై చల్లనై యుండు మాతృ ప్రేమ
జగములో మాతృ ప్రేమకు సాటిగలదె?

గీ॥ అమ్మ బంగరు గర్భాలయమ్ములోన
వాసమున్నంత కాలమే బాధలేదు
పుడమి పైరాకతో వచ్చె నిడుములన్ని
నీటి బాసిన చేపకు చేటురాదె?

గీ॥ అంబయను శబ్దమెంత సారంబుగలదొ!
వేదమై విశ్వమంతట వెలసిపోయె
అట్లుగాకున్న నేర్పించినట్లు ఏల
పలుకుచున్న "దంబా" యని పశువుగూడ.

గీ॥ తేనె రుచి జూడ లభియించు తియ్యదనము
కన్న లక్షలరెట్లకు మిన్న నుండు
అమ్మయను పిల్పు లోగల కమ్మదనము
కాన అమ్మను మరువ శక్యంబుగాదు.

కం॥ అమ్మా! యను కమ్మని శ
బ్దమ్మును నోరార నెవడు పలుకును పలుమా
ర్లిమ్మహిలో వానికి వే
దమ్ములు చదివిన ఫలమ్ము తప్పక నొదవున్!

గీ॥ అరయుగా మాతృప్రేమకు అర్థమిదియె
ఎంతటి విరక్తుండైన నెంత దుష్టు
డైన లోకమునకె గాని వాని తల్లి
కెంత ప్రాణమొ వచియింపనేరి వశము।

ఆ॥ గొప్ప పదవులంది కొండంత వాడైన
తల్లి ముందువాడు పిల్లవాడె
లోకమునకు యెంత లోకువై యున్నను
కొడుకు తల్లికవని కొండ పెట్టు.

కం॥ నరికెడి వానికి నైనన్
తరువిడదే నీడ నట్లె తల్లియు తనను౯
నరికెడి కుపుత్రు నైన౯
కరుణన్ మన్నించు కన్న కడుపెట్టిదయో।

కం॥ తననున్ మొదలంటగ గో
సిన రైతుకు పంట నొసంగు క్షితిపైరు వలె౯
తను జంపు ధూర్తుడైనన్
తనయుని దీవించు కన్న తల్లి ధరిత్రిన్.

# మాతృశ్రీ

గీ॥ క్రూరుడైనను మిక్కిలి కుటిలుడైన
ధూర్తుడైనను మరి కులద్రోహి యైన
తనను జంపెడి వాడైన తల్లి యొకతె
కూర్మి ప్రేమించు మన్నించు కొడుకు నెపుడు.

గీ॥ మిన్ను పైనున్న చుక్కల నెన్న వచ్చు
అర్క శశి మండలంబుల కరుగ వచ్చు
వర్ష బిందువులను గణింపగను వచ్చు
తల్లి ఋణ మెన్నటికి దీర్చ తరము గాదు.

గీ॥ తల్లి కన్న మిన్న దైవంబు కనరాదు
తండ్రికన్న మిన్న దాత లేడు
తల్లి దండ్రులకును తగు సేవ జేసెడు
వాఁడె ధన్యుడరయ వసుధ లోన.

ఉ॥ మాతయె జన్మకారణము మాతయె రక్షజగంబులోపలన్
మాతయె సర్వజీవులకు మంగళదేవత కాన సర్వదా
మాతృపదారవిందముల మస్తక మందు ధరించి భక్తితో
నే తన యుండు సేవ లొనరించు నతండె కృతార్ధజన్ముడౌ॥

సీ॥ గుళ్లలో గూర్చున్న రాళ్ల దేవుళ్లకు
ప్రొక్కులు చెల్లింప మోజులేదు
కాసులు వెచ్చించి కాళ్ల తీపులు బాయ
తీర్థయాత్రలు జేయు దీక్షలేదు
యెడ్డెగా గురువుల గుడ్డిబోధల ముక్తి
సాధించవలెన్న బాధలేదు
ఉపవాసములు సల్పి జపతపమ్ములొనర్చి
శక్తిగడించు ఆసక్తి లేదు.
గీ॥ కాని ప్రత్యక్ష దైవమౌ కన్న తల్లి
పదములకు ననుదినము సద్భక్తి మీర
వందనము లాచరించి ఆనంద బాష్ప
ములను రాల్చగ ఆకాంక్ష గలదు నాకు.

గీ॥ జన్మ జన్మల మరువక జనని ఋణము
వ్రాసి కొందును హృదయ పత్రమ్ము మీద
మాతృమూర్తిని నిరతము మరవకుండ
హృదయ ఫలకము మీద చిత్రించుకొందు!

గీ॥ అమ్మ యొక్కతె సాక్షి దైవమ్మటంచు
అమ్మ పద పద్మముల చెంత తుమ్మెదనయి
అమ్మ కీర్తి గీతికల ముదమ్ము మీర
కావ్యగానమ్ము సేయ నా కాంక్షగలదు.

# స్మృత్యంజలి

కం॥ జననీ! కృపాతరంగిణీ!

నిను దలచిన యంత కనుల నిండుచు మహ్వొం

గిన జలమున నభిషేకం

బొనరింతు భవత్ప దాబ్జ యుగళికి భక్తిన్!

ఉ॥ భారము నెంచకుండ నను బంగరు

గర్భమునందు మోసి ఈ

ధారుణి జూపి నీ అమృత ధారలతో

నను బెంచి నా పయిన్

బేరిమి కూర్మియెప్డు కురిపించిన

తల్లివి నీవు జన్మలో

నీ ఋణ మెట్లు దీరు జననీ!

పరి పూర్ణ కృపాతరింగిణీ!

ఉ॥ కంటికి రెప్పవోలె నను గన్న

దివంబున నుండి యెప్పుడే

కంటక మంటకుండ కడగంటను

గాచుచు నా కొకింత కి

డంటిన రాత్రియుఁ బవలు ఆరట

మంది మదీయ సేవలో

కంటి కొకింత కున్కయిన గానవుగా!

జననీ! కృపాధునీ!

## మాతృశ్రీ

ఉ॥ ఇంటికి పెద్ద దిక్కు వగుటీపెటు
మమ్మోడ బాయలేక నీ
వొంటరివై మరెక్కడ అయో
మయమై పడి కొట్టు కొంటివో
కంటికి కానరావు మము గన్న
దయామయి! మాకు నీ వదా
లంపెడు భాగ్యమింక కరువయ్యెగదా!
జననీ! కృపాంధునీ!

సీ॥ లవమైన విసుగక నవమాసములు మోసి
నన్నుగాంచినది నా కన్నతల్లి
అసు రుసురు మనక ప్రసవ బాధలకోర్చి
నన్నుగాంచినది నా కన్నతల్లి
కనుగందుగా నుండ కంటికి రెప్పనా
నన్ను గాంచినది నా కన్నతల్లి
కూరిమి పేరిమి గోరు ముద్దలు పెట్టి
నన్ను పెంచినది నా కన్నతల్లి.
గీ॥ ఇంతపయికాక చేసిన వంతజెంది
రాత్రి శివరాత్రిగా నిదురలకు వాసి
ఓర్మి నుపచారములను జేయుచును నన్ను
గారవాన సాకినది నా కన్నతల్లి!

సీ॥ ఓరిమి యందున ధారుణి దలపించు
మాతృదేవత నిన్ను మరువగలనె?
కారుణ్య మందు బొంగారు నీరధి బోలు
కరుణామయీ నిన్ను మరువగలనె?
నిస్వార్థమందున నింగిని మరపించు
పరదేవతా నిన్ను మరువగలనె?
ఆత్మ బలము నందు అనిలము సరితూగు
మముగన్న తల్లి నిన్మరువగలనె!
గీ॥ శౌచమున వగ్ని సమముగా దోచు నిన్ను
పరమ ప్రత్యక్ష దేవతా మరువగలనె?
పంచ భూతాలు నీలోన పరిఢ విల్ల
జనని నిను మరువగలనె ఈ జన్మలోన.

గీ॥ నీదు సహనము భూమిని, నీదు నీవి
జలదముమ, నీ శుచిత్వము జాతవేది,
నీ దయాపూర్ణత సుధాంబునిధిని మించ
మాతృదేవతా నిన్నెట్లు మఱువగలను?

గీ॥ పరమ సాధ్వివి సౌభాగ్యవతి వటంచు
వెదకి పేరంటమునకు నిన్ వేల్పు సతులు
పెద్ద ముత్తైదువ వటంచు బిలచి రాక్కొ!
కానిచో దివికిపుడె యేగంగ నేల?

మాతృశ్రీ

ఆ॥ పుత్రులందు నీకు పుట్టెడు బేరిమి
కూతు మీద నీకు కూర్మి మెండు
భర్త మీద నీకు భక్తి నిండగు గాన
దివికి నెట్లు లేగితివొ గదమ్మ!

గీ॥ ముదిమి భార మొకింతయు ముట్టనపుడె
పౌత్రదౌహిత్రులను నేత్రపర్వముగను
కనుచు మురియుచు కాలంబు గడుపుచుండి
యును సుమంగళ వతిగను చనితివమ్మ!

ఉ॥ ముప్పది మూడు ఏడులయి పోయె
సుమంగలివై సుశీలవై
మెప్పగ పుట్టినిల్లు మరి మెట్టిన
యిల్లు పవిత్ర సీమలై
యొప్పగ గీర్తి గౌరవ సమున్నత
దీప్తుల గ్రాలజేసితౌ
గొప్పతనంబు తల్లివని గొప్పగ
జెప్ప నిజంబువల్కితిన్.

సీ॥ నిద్దమౌ మదుటను పెద్దకుంకమ బొట్టు
శశి భాస్కరుల బాల్య దశను దెలుప
స్తవనీయ కోమల నవనీత హృదయమ్ము
పరమ శాంత నిశాంత సరణిదోప

సౌమ్యతాప్యాయతల్ జాలు వారెడు వాక్సు
ధారసంబమల కాసారమనగ
నిరుపమానంబైన కరుణారసమ్ము పొం
గులు వారి పొరలెడి జలధిఁబోల
భవ్యతరమైన నీ పాదపద్మములను
పూజ జేసెడి భాగ్యంబు పొందకుండ
జేసె విధినేమటంచు దూషించువాఁడ
మాతృదేవతా నిన్నిఁక మఱతునెట్లు.

సీ॥ బావను గురువుగా భావించి భక్తినె
వ్వేళ అందున గౌరవించినావు
మరదిని సతతము కరుణను సెరపుచు
సోదరునట్లుగ జూచినావు
తోడబుట్టినవారితో సమంబుగ వది
నల మరందఱులను దలచినావు
కోడండ్రినో లెస్స కూర్మి పేర్మల తోడ
గన్న బిడ్డలవలె గాంచినావు
అక్క చెల్లెండ్రిగా నసమాన ప్రేమతో
నేరాండ్రి నాత్మలో నెంచినావు
గీ॥ కన్న బిడ్డల ప్రాణాలుగా దలంచి
పతిని దైవంబుగా నెంచి భవ్యగరిమ
కర్మ సంసార రథమును ధర్మ మార్గ
మందు నడిపించినావు మాయమ్మ నీవు.

మాతృశ్రీ

సీ॥ పల్లెత్తు మాటైన పతికెదురాడక
పతియె దైవంబన్న భక్తురాలు
గృహమందు సద్ధర్మ గృహిణియై వనులందు
ధవునకు తోడ్పడ్డ ధర్మపత్ని
పదిమందిగల కుటుంబమునకు విసుగక
ఆహార మిడి సాకు అన్నపూర్ణ
ఎరుగదు పతికి మున్నెన్నడు భుజియించి
పావన గుణయుత పరమసాధ్వి

గీ॥ ఓర్పునందున భూదేవి నోడజేయు
నవని పతిభక్తి పావిత్రి నపహసించు
తలప మితభాషి యగుచు సంతతము మెలఁగు
ప్రేమ ననుగన్నతల్లి రామామతల్లి!

ఆ॥ అత్త వలెనె నీవు ముత్తైదువుగనామె
అడుగు జాడలంటి అమరపురిని
గాంచ నేగి తట్లు గాక సుమంగళ
పతిగ నేగు టెట్లు క్షితి ఘటిల్లె?

గీ॥ ఒకరి నొకమాట యనలేదు ఒకరిచేత
యెన్నడొక మాట బడియింత యెరుగవమ్మ!
ఆత్మగౌరవమే ప్రాణమని తలంచి
దాచుకున్నావు అభిమాన ధనముమదిని.

గీ|| కటకటా! వ్యాధిభాధ నొందుటయె గాక
తమ కొరకు మేము నొందు కష్టములకెంతొ
భాధ పడుచుండితివి నీ స్వభావమెంత
సుస్వభావమొ జనయిత్రి! శుభ చరిత్రి!

చ|| కొడుకులు కూతురున్ సరియె
కోడలు వేరొకరింటి బిడ్డ నీ
కడుపున బుట్టకున్న కడుగాఢిలి
కూర్మి సపర్యచేసె నీ
యిడుముల యందు నీ సుకృతమే
యిటు కోడలి రూపమౌచు తో
డ్పడెనని తోచెడిన్ జనని! పావని!
పూర్ణకృపాతరంగిణీ.

చ! ఎరుగవు డంబమింతయును యెవ్వరికిన్
జెయిసాచి నట్టి రో
జెరుగవు భర్త యిష్టమున కెన్నడయిష్టము
జూపలేదు, ఎ
వ్వరికిని యింటి గుట్టుల రవంతయునైనను
చెప్పకుండ సం
సరణము తీర్చి దిద్దితివి సద్గుణరాశివి
మాతృదేవతా!

మాతృశ్రీ

చ॥ ఎరుగవు మాయ మర్మములు హెచ్చులు
మచ్చులు లేవు, ఎన్నడున్
బిరుసుగ మాటలాడి యెరువెయ్యము
కయ్యము గాగ మార్చలే
దెరుగవు బొంకు గొంకుల నొకించుక
నైనను కోపతాపమే
యెరుగవు నీకు సాటి యెవరే
జననీ! కరుణాతరంగిణీ!

ఉ॥ సన్నుతి జేయ నా కవిత చాలదు
నీదు ప్రసన్నశీల సం
పన్నత గూర్చి నీ సుగుణ పాళి
గణింపగ రాని దివ్యద
ధ్యున్నత తారకా వితతి పోల్కి
హృదంబర మందు వెల్గగా
నెన్నగ బూని మూగనయి యెట్లొ
గణింపగ ప్రాకులాడితిన్.

ఆ॥ నీ గుణాల వెంట నా గణాలింపుగా
నడువలేక యెట్లొ నడువ సాగె
తల్లివెంట పక్షిపిల్ల లేగగ నెంచి
యెగయ లేక యెట్లొ యెగయునట్లు

గీ॥ నెమలి పదముల మాదిరి నీతనూజు
పదము లందము గాకున్న విదితమైన
నీ సుగుణరాజి పింఛమట్లొను గనుట
కొదువ యెందున గాను పించదు గదమ్మ.

## బాష్పాంజలి

సీ॥ మృదులమై యొప్పు నీ హృదయంబు వికసిత
భవ్య సరోజంబు పగిది దోచ
సాధుసౌశీల్యాది సద్గుణ ప్రకరంబు
చంపక కుసుమంబు సరణిదోచ
పరమ పతివ్రతా పరిశుద్ధ వర్తన
మల్లికా గుచ్ఛంబు మాడ్కిదోచ
సమధిక గృహధర్మ సదమలాచారంబు
పచ్చని చామంతి భాతిదోచ
గీ॥ స్వార్థరహితత చెంగల్వ సమము దోచ
త్యాగశీలత పారిజాతముగ దోచ
రమ్య గుణ పుష్పములను హారముగ గూర్చి
దాల్చు దైవము గొనిపోయె తల్లినిన్ను!

సీ॥ మా కన్నతల్లి సముంచిత దేహము
ప్రజ్వరిల్లెడి అగ్నిపాలుజేసి
మా జననీ శల్య మణి నిచయంబును
ప్రథిత కృష్ణావది పాలుజేసి

## మాతృశ్రీ

మా మాతృదేవతా మంగళ జీవుని
పరలోక క్రియ నీవు పొలుజేసి
మా జనయిత్రి సమ్యక్కీర్తి తేజముఁ
పటు దిగంతంబుల పొలుజేసి
గీ॥ మరువరానట్టి మాతల్లి పరమమూర్తి
హృదయ పీఠంబునందు చిత్రింపజేసి
చిరతరాసక్తి నెప్డు పూజింపవలసె
నింతలో నిట్లు జరుగగా నేల లీల?

సీ॥ చల్లార్చె నే? నీదుజాడ్యదావాగ్ని నా
హృదయ జన్య విషాద వృష్టి కురిసి
చేకూర్ప జాలెనే? నీ కాత్మశాంతి నా
కూరిమి దళుకొత్తు నూరడింపు
మాన్పెనే? నీ మనో మరణ భయంబును
స్థైర్యమైనట్టి నా ధైర్యబలము
తీర్చెనే? సరవి మాతృణ మొక్కింతేని
సుకరమౌ నాదు శుశ్రూషధనము

గీ॥ ఎన్ని చేసిన కాని నీ కెట్టిమేలు
కూర్చి బ్రతికించ లేనట్టి కొడుకు నైతి
విధికృతంబును నెవరు తప్పించగలరు?
ఏమి సేయుదు తల్లి సాధ్వీమతల్లి!

గీ॥ దుస్తరంబైన వ్యాధి నొందుటను బట్టి
కొడుకు శుశ్రూష ఉపయోగపడక పోయె
ననుచు నెంతయో వ్యాకుల మందినావు
మాతృ దేవతా నీ వ్యధ మరతు నెట్లు?

గీ॥ చీకు తొలగించి నిన్ను రక్షింపలేని
నిరుపయోగ్యుడ నొటచే మరుపురాని
నీ విషాదాంతమైన కన్నీటి గాధ
జీవితాంతము నన్ను శిక్షించుబాధ!

గీ॥ నిన్ను బ్రతికించ నెంచి పాట్లెన్ని బడిన
తుదకు దుఃఖసముద్ర మందున మునిగితి
అమృత మాశించి యుంటి పేరాశతోడ
విఫల హాలాహలంబు లభించెనాకు!

గీ॥ నీ శుభాశీస్సులను గొని నిరతమేను
భక్తియుక్తుడనగుచు నీ పాదములను
నమ్మి సేవించు పుత్రుని నన్ను నిట్లు
వదలి దివికేగుటయ ప్రతిఫలమునాకు!

ఆ॥ నా కొకింత వంత సోకనీయక నన్ను
కంటిరెప్ప పగిది గాచినావు
నాకమునకు నేగి శోకాబ్ధి ననుముంచ
న్యాయమగునె నీకు నాదు తల్లి?

## మాతృశ్రీ

శా॥ నమ్మంజాల మనంబులో బుడమి
కానన్ రాకయున్నట్టిదై
నమ్మున్ నన్ దయగాంచి పెంచు
కతనన్ ప్రత్యక్ష దైవంబు మా
యమ్మే యంచని నమ్మినందులకు
దుఃఖాంబోధినన్ ద్రోసి, ఓ
యమ్మా! యెక్కడ బోతివే!
తిరిగిరావా! మళ్లినన్ గాంచగన్

చ॥ భువి జనయిత్రి యే యెరుగు
పుత్రుని శోకము మాన్పనింక నే
నెవరికి సెప్పుకొందు జననీ!
ఇటు మమ్మొదలాసి అక్కటా!
యెవరును దీర్పలేని భరియింపగరాని
హృదాగ్ని రేపగన్
దివి కరుగంగ పాడియటె,
దిక్కెవరే మమునూరడింపగన్!

సీ॥ అలొపథిక్ డాక్టర్లు ఆశలేదన్నను
వైద్యప్రయత్నంబు వదలలేదు
నేటి మందే మని నిర్లక్ష్యభావంబు
తో తచ్చికిత్సల దూరలేదు

హోమియో మందులతో మానునని యెంచి
దాని నివ్వించుట మానలేదు
బాబాల దీవెనల్ బడసివారి పవిత్ర
భూతి నిప్పించక పోవలెదు

గీ॥ లేదు దేవుని ప్రార్థన లేని దినము
లేదు విశ్రాంతి హృదయాన లేదు శాంతి
ఇన్ని లేదన్న బీదపై కృపను మాలి
నాక మేగితమ్మా! నన్ను శోకపరిచి!

సీ॥ నిత్య మారోగ్యాన నెగడు చుండెడి నీవు
కఠిన రోగంబున గడిపితెట్లు?
గృహధర్మ కార్య నిర్వహణ నుండెడి నీవు
పడకపై మూల్గుచు బడితివెట్లు?
పొరిగిండ్ల కెన్నడు పోవనేరని నీవు
పురివైద్యులిండ్లకు నరిగితెట్లు?
ఎన్నడైనను చింత యెరుగకుండెడి నీవు
ఘనతర దుఃఖాన మునిగితెట్లు?

గీ॥ ఇంచుకేనియు కష్టంబు లెన్న డేని
యెరుగనట్టి నీవు కటకటా యింత కష్ట
మెట్లు భరియించితివి విధి యెంత జేసె?
మాతృదేవతా నీవ్యథ మరతునెట్లు?

గీ॥ వ్యాధి యని వార్యమని మనోవ్యాధి చేత
వ్యాకులము నొంది బ్రతుకు నిరాశజెంది
విధికిలొంగి నీ వెంతక్షోభించినావు!
మాతృదేవతా! నీ వ్యధ మరతునెట్లు?

శా॥ నా మాటన్ మదినెంత నమ్మితివొ!
చింతన్నెడు బోనాడి ఆ
రామున్ వేడు మటంచు చెప్పగనె
దౌర్బల్య ప్రయాసంబుతో
"రామా రామ" యటంచు బల్కితివి
ఆ రాముండు ప్రత్యక్షమై
ప్రేమన్ బల్కెనొ లేదొ! నేనెరుగ
తల్లీ! తెల్పకె పోతివే!!

గీ॥ జనని నినుగావు మన్న ప్రార్థనల వినియు
కటకటా! నిను మ్రింగి దుఃఖమిడె మిత్తి
పూల దండల గైకొని ముండ్లదండ
లొసగివట్టిక నేమి సేయుదును తల్లి!

గీ॥ ప్రళయ జలధి తరంగ ప్రవాహమందు
కొట్టుకొని పోవుచుండెడు కొండలట్లు
సరవి నా ఆసలన్ని దుర్భర విషాద
గాఢ బాధా ప్రవాన గదలిపోయె!

మాతృశ్రీ

# నిరసనాంజలి

గీ॥ అమిత తాపంబుచే నీదయామృతమును
బడసి సుఖియించు కొఱకు నే పరుగు లిడితి
గాని మృగతృష్ణగా మారెగా అమృతము
క్షితిని దురదృష్టుడెట్లు మేల్ జెందగలడు?

ఆ॥ తానొకటి దలంప దైవంబొకటి గూర్చు
దైవ విధికి అడ్డు తగుల లేము
తలచుకున్న దెల్ల తప్పక నెరవేర
దైవముండె నమచు తలతురెవరు?

ఆ॥ విధివశంబుచేత విశ్వసంతానంబు
కష్టపడుచు నుండ గాంచలేక
దైవమన్న తండ్రి దాగిపోయెనేమొ
కాకపోయెనేని కానబడడె?

ఆ॥ చావుపేరు విన్న సకల ప్రాణికి భీతి
బాధలెన్నియున్న బ్రతుకె ప్రీతి
భీతిలేనిచావు ప్రీతిలేని బ్రతుకు
లేదు లేదు జగతి లేదులేదు.

మాతృశ్రీ

గీ॥ వెంట నంటెడు విధియను వేటమృగము
పాడిలో జిక్కినట్టి దౌర్భాగ్యజీవి
రక్షజేయగ జాలవు రక్షకుడని
బిరుద మేరీతి గలిగెనో పరమపురుష!

గీ॥ నీ దయాసాగరము లోన నేమి కొఱత
కలిగెనో నిన్ను పలుమారు తలచి తలచి
దేహి యనువాని దాహంబు దీర్పవైతి
వరదుడను పేరదెటు బోయె పరమపురుష?

గీ॥ దైవమా! నీవె కఠినము దాల్చితేని
మానవులు దానవులుగను మారిపోరె?
కంచెయే చేను మేసిన కనికరించి
అడవి పక్షిమృగాదులు అడ్డుపడునె!

సీ॥ సిరులలో నెవ్వేళ మురియుచుండు నొకండు
కూడొకింతయు లేక మాడు నొకండు
సంతాన మధికమై వంత జెందు నొకండు
పిల్లలు లేక చింతిల్లు నొకండు
తలపకయే ఫలంబులను పొందు నొకండు
తలచి ఘటిల్లక నలుగు నొకండు
దొడ్డపదవి నొందు దుర్మార్గు డొక్కండు
హైన్యస్థితి మెలంగు మాన్యుడొకండు

గీ॥ అలఘు కష్టంబు లొందు పుణ్యాత్ము డొకఁడు
అతి సుఖంబుల నొందు పాపాత్ము డొకఁడు
ఏమి సెప్పుదునయ్య సర్వేశ నీదు
చిత్రలీలల వర్ణన సేయుతరమె!

సీ॥ శరణార్థినై నిన్ను మొరవెట్టుకొన్నను
కొంచెమైనను నాలకించ వేల?
నోరు నొవ్వగనిన్ను సారెకు బిలచిన
బదులొక సారైన పలుకవేల?
ఎందెందు వెదకిన నెన్నొ డేనిని యొకింత
ప్రేమతోడను గామ పింఁచవేల?
కన్నీళ్ల నీకాళ్లు కడిగి మ్రొక్కినగాని
కరుణాపయోధివై కరుగవేల?
గీ॥ చెవిటివాఁడవొ! మూగవాఁడవొ! శరీర
హీనుఁడవొ! కర్కశుండవొ! యెరుఁగరాదు
నిన్ను గొలచిన ఫలము గాన్పించదయ్యె!
భక్తహృత్పంకజనివేశ! పాపనాశ!

గీ॥ యాచనా లోచనముల నాలోచనముల
యెరుగ లేకుంటివో లేక యెరిగి యెరిగి
యెరుగనట్టి వానివలె నటింతు వేమొ
మరుగు తెరవీడు టెప్పడో అరయకుంటి.

## మాతృశ్రీ

ఉ॥ కమ్మిన చిమ్మ చీకటుల
కౌగిలి నుండి విమోచనార్థమై
క్రమ్మర ప్రాకులాడితి
అగాధములోబడి కాంతికోసమై
ఇమ్మహి నాస్తి కాధము లిహి!
యని నవ్వెరి నన్ను జూచి నీ
నమ్మినవారి నీ పుడమి
నవ్వుల పాలొనరింతువా ప్రభూ!

ఉ॥ పుట్టుట గిట్టుటో మరల
పుట్టుక గిట్టుటో! గిట్టి పుట్టుటో!
గిట్టుట పుట్టుటల్ దెలిసి
గిట్టని పుట్టుక పుట్టుటెట్టులో
మట్టి శరీర ధారులము
మాయ జగంబున బుట్టి సృష్టిలో
గుట్టు నెరుంగలేము మము
గూరిమితో దరిజేర్పు మీశ్వరా!

## మృత్యు రాక్షసి

గీ॥ ఓసి మృత్యువ! వికటాట్ట హాసమేల
జేసెదసె! మజ్జనని స్వర్గసీమజేరి
సౌఖ్యముగ నుండె శుకము పంజరము వీడి
వృక్షశాఖాగ్రమును జేరి వెలయునట్లు.

గీ॥ ధాత్రి నీ పేరు విన్నవారందరికి వేడె
ఓసి! రక్కసి మృత్యువా! ఒక్కరైన
పిలువరు గదా మరేటికి పిలువకున్న
జేరుచుండెదవందరి సిగ్గువిడిచి.

గీ॥ మృత్యువా మంచి చెడు లెంచకే వదేల
వీరులను త్యాగరతుల కవిప్రవరుల
దాతలను నిత్యధర్మవర్తనుల మ్రింగి
మిట్టి పడెదు వారలకీర్తి మ్రింగ గలవె?

దుర్విధి

చ॥ కనికర మింతలేక నను గన్న
దయామయి మాతృదేవతా
తనువు కృశింపజేసి విహితంబని
మ్రింగితి వౌరె! నీకు స
జ్జనముల హింస పెట్టుటయె సంతసమా!
ఇంక లేక దుష్టవ
ర్తనగలనీకు సజ్జన వితానము
వైరులె? తెల్పుదుర్విధీ!

కం॥ నిను పీడించిన జాడ్యం
బును మాన్పగ లేని నేర మునకున్ దుఃఖం
బును పొందవలసి వచ్చెను
జననీ! విధి నడ్డుకొన నశక్తుడ నైతిన్!

# హృదయాంజలి

మ॥ ఎదలో దుఃఖ దవాగ్ని రేగినది
అందే నిల్పుకొన్నట్టి నీ
పద పద్మంబులు గాలునేమొ యని
బాష్పాంభోనిధుల్ మ్రింగినన్
మదిలో నగ్ని శమింపదయ్యె నిఁక
నమ్మన్మాత కీవాత్మశాం
తి దయన్ గూర్చుచు నూరడింపగదెనన్
శ్రీ రాజ రాజేశ్వరా!

మ॥ చెలరేగెన్ ఐమగాడ్పు కల్పతరుగూల్చెన్
శిత్త శోకాగ్నియున్
జెలరేగెన్ బ్రవహించె బాష్పజలముల్
నేత్రాంబుధుల్ నిండి హిం
గుల గ్రిక్కన్ దెగిపారె నే
నిలువలేకున్నాడ నీవాఁడ నీ
నిలయంబున్ గని నాడగావగదె నన్
శ్రీ రాజ రాజేశ్వరా!

శా॥ గుండెల్ దల్లడ మొందగా నురిమి
చక్షుల్ నిండవర్షించి హృ
త్ఖండక్షేత్ర విషాద దాహ మిసుమంతైన
దీర్చ లేకుండె నీ

యందన్ జేరితి నీకృపామృత రసం
బశ్రాంతముం జిల్కి పే
ర్మిండెందంబును దృప్తిజేయగదవే!
శ్రీ రాజ రాజేశ్వరా!

మ॥ వెతలన్ బొందుచు కుందుచున్
హృదయ మన్వేషించు శాంతి ప్రస
న్నతకై కాని లభించదాయె
నికనైనన్ బ్రేమతో నన్ను వి
స్తృత సంసార పయోధి దేల్చుచు
సదా స్వేచ్ఛా విహారమ్ముగా
ధృతి మీరన్ బ్రతుకంగ జేయగదవే!
శ్రీ రాజరాజేశ్వరా!

శా॥ ఏరాలేదిటు నిన్ను జూడగను
ప్రత్యేకంబుగానైన ఏ
దో రాజ్యాంగపు టూరు వెట్టి నను
యెంతో ప్రీతితో నీవె నీ
వే రప్పించితి దర్శనంబిడితి నీ
ప్రేమాంత రంగాలయు
శ్రీ రాజిల్లుచు మాకు చోటొసంగుగా
శ్రీ రాజ రాజేశ్వరా!

మాతృశ్రీ

మ॥ మడిలేకే చమదెంచినాడను ప్రభూ!
మన్నింతువా నన్ను! నీ
గుడికేతెంచితి రిక్తహస్తముల నన్
గూర్మిన్ గటాక్షింతువా!
యెడదే నీగుడి దానిలో వెలయు
నిన్నేరితి సేవించుటో
మృడ! నా కయ్యది దెల్పి ప్రోవగదవే!
శ్రీ రాజ రాజేశ్వరా!

మ॥ పదముల్ సొలవు నీ పదాల్ గొలువ
భావంబంతకున్ జాలదిం
పొదవన్నీ మహిమోన్నతుల్ పొగడ
శంభో! ఎట్లు వర్ణింతునిన్
జదువుల్ నేర్వగ లేదు నీ పద
సరోజ శ్రీలపై వ్రాలి చే
సెద నీ సంస్తుతి దివ్యగానమళినై
శ్రీ రాజ రాజేశ్వరా!

మ॥ నిరుపేదన్ శిథిలంబు నా గృహము
తండ్రీ! జీవితం బెన్న సా
గరమై యొప్పను దాని యందుగల
పంకంబందె పంకేజముల్

విరియన్ ఖూచెను నీదు పూజకయి
సం ప్రీతిన్ గటాక్షించి నా
చిరుకాన్కల్ గయికొమ్ము వేగమె ప్రభూ!
శ్రీ రాజ రాజేశ్వరా!

శా॥ ఈవా! ధాత్రి నగోచరుండవిఁక
నిన్నే లీల సేవింతునో
దేవా! నేనొక అల్పమానవుడ
సందేహాత్ముడన్ మూర్ఖుడన్
రావే! దర్శన మీయవే! వరములన్
ప్రాప్తింపగా జేయవే!
సేవింతున్ భవదీయ పాదయుగళిన్
శ్రీ రాజ రాజేశ్వరా!

శా॥ ఈవే విశ్వము విశ్వమంతయును
నీవే కాన ఈ దివ్య తే
జోవంతంబగు శిల్పికల్పిత కళా
సూక్ష్మంబులో లీనమై
నీ విశ్వాకృతి నిండి యుండదెటు?
నిన్నే నమ్మి కై మోడ్చుచున్
సేవింతున్ భవదీయ మూర్తిని హరా!
శ్రీ రాజ రాజేశ్వరా!

మాతృశ్రీ

మ॥ ఎండ దేనాటికి పూయకుండుటను
స్వామీ! రిక్త హస్తాల నీ
గుడికేతెంచితి సాగిలంబడి
త్వదంఘ్రుల్ బట్టుకొన్నాడ ప్రే
ముడితో నన్ను కృతార్థు! జేయుము
స్వయంభూ! శంభులింగ ప్రభూ!
దృఢ భక్తిన్ నిను గొల్తు మానసవిభూ!
శ్రీ రాజ రాజేశ్వరా!

శా॥ స్వామీ! నీవెశరణ్యమంచు మది
సంభావించి దైన్యంబుతో
నామూర్ధంబు భవత్పదాబ్జముల
నానన్ మోపి బాష్పంబు ధా
రామాలిన్య మొనర్చు వాఁడవని
బల్ శంకించి కన్పింపవా!
ప్రేమాపూర్ణునకిట్టి శంక తగునా!
శ్రీ రాజ రాజేశ్వరా!

---

ఈ పద్యములు శ్రీ వేములవాడ రాజరాజేశ్వరస్వామివారిని సందర్శించి వ్రాసినవి.

గీ॥ స్వామి! నీ పాదములు మనసార కడిగి
దైన్యమున మొక్కులర్పింపఁ దలఁచినంత
యాచనా దీన నేత్ర ద్వయమ్ము నుండి
గోరు వెచ్చని కన్నీరు కురియ సాగె!

గీ॥ భక్తి రసపూర్ణ భావ సంపత్తి చేత
పొంగి పారలెడు బాష్పతరంగములకు
యెడఁదలో నున్న మలినము కడుగబడియె
అడుగిడుము స్వామి నా యెదగుడిసెలోన!

గీ॥ శిథిలమైనట్టి నా చిన్ని చిత్త గృహము
లోన నడుగిడ భక్తి సోపానములను
వేసికొని నిన్ను బిలచితి వేగరమ్ము
ఆరగించగ పేద సత్కారములను.

గీ॥ హే ప్రభూ! హేదయాకర! హేదయాళూ!
పాహిమామ్! దీనబాంధవ! పాపహారి!
ఈవుదప్ప నితః పరంబెరుగ నయ్య!
రమ్ము వే వేగ నన్నేలు కొమ్ము స్వామి!

"అన్యథా శరణం నాస్తి
త్వమేవ శరణం మమ।
తస్మాత్కారుణ్యభావేన
రక్షరక్ష మహేశ్వర॥"

# శాంతిగీతి

ఉ॥ శాంతము నీ స్వభావము, ప్రశాంతము
నీ హృదయమ్ము, భావమో
అంతకుమించి మంచుమలయై
విలసిల్లు, వచస్సులన్న న
త్యంత మృదు ప్రసన్న మధురామృత
ధారలు, భావకాత్మయుఁన్
శాంతిలు గాక నిర్మల విశాల
కృపామతి మాతృదేవతా॥

"ఓం అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ"

ఓ దేవా మమ్ములను అసత్తు నుండి సత్తునకు
చీకటి నుండి వెలుగులోనికి
మృత్యువు నుండి అమృతత్వమునకు తీసుకొనిపొమ్ము।

"సర్వేషాం స్వస్తిర్భవతు
సర్వేషాం శాంతిర్భవతు
సర్వేషాం పూర్ణం భవతు"
ఓం శాంతిః శాంతిః శాంతిః